శ్రీరస్తు

# శ్రీ ఉత్కల విప్రవంశ ప్రదీపిక



ఇది

శ్రీ మదరాసు గవర్నమెంటు సాల్టు యుద్యోగస్థుడును

శ్రీ విజయనగర పురీ వాస్తవ్యుడును

అగు

**కీ॥ శే॥ కుప్పిలి కృష్ణమూర్తి కవిచే**

**1910 వ సం॥రంలో రచియింపఁబడినది.**



శ్రీ ర స్తు

# శ్రీ ఉత్కళ విప్రవంశ ప్రదీపిక



కీ॥ శే॥ కుప్పిలి కృష్ణమూర్తి కవిచే రచియింపబడి

కుప్పిలి గ్రామ వాస్తవ్యులు
కుప్పిలి రాఘవరావుగారి అధ్వర్యమున

శ్రీకాకుళం జిల్లా శిష్టకర్ణ సమాజాభిమాని

కుప్పిలి సుదర్శనరావుగారిచే
శ్రీ సుదర్శన్ పవర్ ప్రింటర్సు నందు ముద్రింపబడినది
ఆమదాలవలస ఫోన్: 91. (శ్రీకాకుళం జిల్లా)

పునర్ముద్రణ: ఆగస్ట్ 15, 2003
చౌదరి. లక్ష్మరామూర్తి
వైస్ ప్రెసిడెంటు, హైదరాబాద్ అసోసియేషన్.



( కుప్పిలి రాఘవరావు )

## ముఖ్య గమనిక :-

1910 వ సం॥రంలో కీ॥ శే॥ కుప్పిలి కృష్ణమూర్తిగారిచే యీ ప్రతి రచించబడియుండెను. యీ ప్రతులు ఎచ్చట దొరకనందున మన బంధుమిత్రులు చాలామంది కోరుచున్నందున, శ్రీకాకుళం జిల్లా శిష్టకరణ సంఘాభిమాని యగు శ్రీ కుప్పిలి సుదర్శనరావు, ఆముదాలవలసవారిని యీ ప్రతి ముద్రిణ చేయించమని కోరగా అంగీకరించిరి.

ఇట్లు

**కుప్పిలి రాఘవరావు**

కుప్పిలి

(శ్రీకాకుళం జిల్లా)



( కుప్పిలి సుదర్శనరావు )

బంధుమిత్రులారా !

శ్రీ కుప్పిలి రాఘవరావుగారి అధ్వర్యమున యీ ప్రతి ముద్రింప చేయించితిని, బంధుమిత్రులు, ఆదరాభిమానములతో, యీ ప్రతియందుగల విషయములు అందరు, గమనించ గలందులకు కోరుచున్నాను.

ఇట్లు మీా కృపాభిలాషి

కుప్పిలి సుదర్శనరావు

ఆమదాలవలస-ఫోన్ నెం. 91

(శ్రీకాకుళం జిల్లా)

# పీఠిక

ఆర్యవర్యులారా!

నేను చిరకాలమునుంచి యేతద్గ్రంథమును రచియింపనుద్దేశించి యిటీవల అట్టి నాయుద్యమమునకు నస్మదీయకులసంజీవితుండును, మహనీయులును నగు శ్రీమాన్ ఇప్పిలి అప్పల నృసింహశర్మగారి ప్రోత్సాహ పురస్సరంబుగా అనేక గ్రంథములను బరిశీలించి నేనీ గ్రంథమును విరచించితిని. బ్రహ్మశ్రీ మన్నవ బుచ్చయ్యపంతులు, పెద్దనామత్యుడు, సింహవాజపేయ పండితులు, శ్రీకృష్ణపండితులు, శ్రీమాన్ కాండూరి లక్ష్మణాచార్యులుచే రచియింపఁబడిన గ్రంథములలో శిష్టకరణాన్వయ సాముదాయమునుగూర్చి కొంతవరకు వక్కాణింపబడియున్నది, గాని అస్మద్దేశీయులగు శిష్టకరణంబులయొక్క యుత్పత్తి, స్థితి, క్రియాచార వ్యవహార కర్మ విషయములంగూర్చి విపులముగా దెలియపర్చనందున పండిత పామర జనాళికిం గూడిదెలియునటుల తేటతెల్లమగు తెనుగు మాటలచే నేనీ గ్రంథమును విరచించితిని. భవిష్యత్పురాణము, పద్మపురాణము, విష్ణుపురాణము, బ్రహ్మాండపురాణము, కూర్మపురాణము, బృహన్నారదీయము, పరాశరస్మృతి, ఉజ్వరము, విప్రవంశము, దశవిధబ్రాహ్మణశాఖావివరము, చరణవ్యూహము, నాడీశాస్త్రము, వేదనారాయణకథాసుధారసము, అనునీ మొదలగునేక ప్రామాణిక గ్రంథములను పరిశీలించి తత్సారాంశములంజేర్చి యొక్కచో నీగ్రంథమునుగూర్చి పురాతనమునుండి యూహించుచున్న నా మనోరథము నునిర్విఘ్నముగా నెరవేర్చుకొంటిని. గ్రంథరచన కిదియే ప్రప్రథమ పరిశ్రమంబగుటచే దీనిబఠించెడి సుగుణ గణ గ్రహణైక పరాయణులగు విద్వత్ సుహృద్వరులెల్లరిందలి యసంఖ్యాకంబులగు వ్యాకర

ణాది దోషపుంజంబుల మన్నించి అట్టివాని దెల్పినయెడ రెండవకూ
ర్పున సవరించెద.

చ॥ వెలయగ నస్మదీయ కులవిశ్రుత గ్రంధము చెప్పుమంచు|
ప్పిలికుల పావనుండును వివేక యశోధనుఁడార్య వర్యుఁడు|
ప్పల నరసింహశర్మ దగబల్కినఁ బూనికఁ గొన్ని పుస్తకం|
బులు బరికించి చేసితిని మోదముతో దుత దీని నెంచగాన్॥

క॥ ఒప్పుగ బెంచిన కీరము।
తప్పులు బల్కినను విని ముదంబందుగతిన్।
తప్పులు నీకృతిఁ గల్గిన।
నొప్పులుగాగొన నుతింతునో బుధులారా॥

క॥ వినయ నిధి రంగయాఖ్యుని।
తనయుండన్ విజయనగర ధాముఁడఁ ద్విజుఁడన్।
ఘనమగు నేతద్గ్రంధం।
బును జేసితి కుప్పిలి కృష్ణమూర్త్యాహ్వయుఁడన్।

ఇచ్ఛాపురము,
30-6-1910

ఇట్లు,
ఆస్తిక జనమిత్రుఁడు
కుప్పిలి క్రిష్ణమూర్తి.
- క వి.

శ్రీ

# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## ప్రథమాధ్యాయము.

శ్లో॥ గణాధిపం విఘ్నగణాప మర్దనం ।
సమస్తదేవాగ్రి సరైక పూజనం ।
స్వభక్త కల్పద్రుమ మల్పచేతనై ।
రగమ్యరూపం ప్రణతోస్మి సర్వదా ॥

ఉ॥ (శ్రీ) వెలయం జగంబులకు
జెల్వొనరించు శశాంకునిన్ దలన్ ।
తీవి యెలర్పదాలిచి న
టించిన యజ్ఞనజారివేల్పు త ।
ద్భావభవారి పెంజడను
బాహులబట్టి యుయాలలూగుచున్ ।
గ్రోపలబారు విఘ్నపతికిన్
వినుతింతు నితాంతు భక్తితోన్ ।

ఉ॥ కుందతుషార హీరశత
కోట్యహిరాజ గిరీశకాశ పూ।
ర్ణేందువియన్నదీకలశ
నీరధికల్పతరుప్రభాకృతీ॥

కందళితారవింద భవ
కల్పిత మోహిని ధాత్రిగేహినీ।
నందన మేనొనర్చెద వా
ణి బురాణికృపా ప్రపూగణీ॥

జగదాధారునకుసమర్పితంబుగా నేరచియింపంబూనినయుత్కల విప్రవంశ ప్రదీపిక యనునీ మహా గ్రంథంబునకుం గథాక్రమం బెట్టులనిన!

## విప్రవంశ శాఖా వివరము.

శ్లో॥ మహారాష్ట్రాంధ్ర ద్రవిడాః
కర్ణాటచ్చైవ ఘూర్జరాః ।
ద్రావిడాః పంచధాప్రోక్తా
వింధ్య దక్షిణ వాసినః
సారస్వతాః కాన్యకుబ్జా
గౌడా ఉత్కల మైధిలాః।
గౌడా పంచ విధాః ప్రోక్త
వింధ్యా దుత్తరవాసినః॥ (విప్రవంశము.)

తే॥ గీ॥ బ్రాహ్మణులు రెండువిధముల బరగుచుందు।
రవని ద్రావిడులని గౌడులనియు వరుస।
వీరు నివసించియుందురు వింధ్యగిరికి।
కుశలులై దక్షిణోత్తర దిశలయందు॥

పంచద్రావిడ బ్రాహ్మణులు వింధ్యకు దక్షిణ దేశమునను, పంచగౌడ బ్రాహ్మణులు వింధ్య కుత్తర దేశమునను నివసింతురు,

వీరు వేద వేత్తులై పరమ పవిత్రంబగు వృత్తులంబరగి షట్కర్మ నిరతులై వరలుచుందురు.

## పంచ ద్రావిడ బ్రాహ్మణులు

1. మహారాష్ట్రులు. 2. ఆంధ్రులు. 3. ద్రవిడులు. 4. కర్ణాటకులు. 5. ఘూర్జరులు.

## పంచ గౌడ బ్రాహ్మణులు

1. గౌడులు. 2. మైథిలలు. 3. ఉత్కలులు. 4. సారస్వతులు 5. కన్యాకుబ్జలు.

ఈదశవిధ బ్రాహ్మణులలోకూడా పెక్కునుపశాఖలు గలవు. అట్టినుపశాఖలనిదివరకే "విప్రవంశము". "దశవిధ బ్రాహ్మణ శాఖావివరము" అనుగ్రంథములలో వివరముగా వక్కాణింపబడి యుండుటచే నయ్యదియ్యెడ గ్రంథవిస్తర భీతిచే వివరింపలేదు. అందు శాఖాభేదములయొక్క నుత్పత్తి కారణములు వక్కాణించక పోవుటచే నిప్పుడు పంచగౌడులలోని నుత్కలబ్రాహ్మణ శాఖలనుగూర్చి కొంతవివరించెద.

## ఉత్కల బ్రాహ్మణోప శాఖావివరము

ఉ॥ శాశని ఘాటియాకొటికి
సాంతో యుశ్రోత్రియ భోద్రిసాహు పం।
డా శతపస్తిశిష్టకర
ణాఖ్యులు నుత్కల దేశవిప్రులై।

దేశ విదేశముల్ దిరుగు
దిట్టరుతాటను దెల్పనోడు వా।
తాశను (జ్జైనవారి వివి
ధాంతర శాఖలపెక్కు వర్తనల్॥ (విప్రవంశము.)

క॥ హాలధరులు మరియుబూజా।
రులునైవర్తించు ద్విజవరులకు మహాస్తా।
నులు హోలువా పొండాలని।
పిలుతురు వాడుకగ మూడు పేరులచేతన్॥

కావుననీ దశవిధనుపశాఖలలో పెక్కు శాఖలు కలవు. అందు

పండాలలో

(1) మహాస్తానులు. (2) పూజారులు. (3) హోళువాలు
(4) సాహువాలు (5) దానవాలు.

2 కరణాలలో (1) శిష్టకరణాలు (2) శిష్టకాయస్థులు. (3) అంబష్టులు. 4 సూతకాయస్థులు. (5) వైశ్య కాయస్థులు. అని దశవిధములు.

గీ॥ గౌడ విప్రులగుచు ఘనరాచకార్యని।
ర్వాహకత్వనిపుణ వైభవమున।
శిష్టులైచరింప శిష్టకరణములని।
వాడుచుందు రఖిల వసుధ జనులు॥

కావున శిష్టకరణములను గౌడ విప్రులుత్కల దేశమునుంచి

లౌకికాది రాచకార్యములపై నీకళింగ దేశమునకేతెంచి వారి వారి కులాచారములను విడువక సంచరించెదరు.

ఉ॥ శ్రీయుతలౌక్య వర్తనులు
శిష్ట గుణుల్ క్రతుసద్గ్రహాధి పా।
మేయఘనాపరాభిదుల
మిత్ర విషూదన తాభియుక్త భూ।
నాయకమాన్య శిష్ట కర
ణాఖ్యులు వీరల జాతపద్మ ప।
త్రాయత నేత్రజన్యులును
తత్కర ణాఖ్యను దాల్తురెంతయున్॥ (విప్ర)

టీక॥ శ్రీయుత = శోభాయుక్తమైన, లౌక్యవర్తనులు = లౌకిక ప్రవర్తనగల వారును, శిష్టగుణుల్ = శ్రేష్టమైన గుణములుగలవారును, క్రతు సద్గ్రహాధిపామేయఘనాపరాభిదులు అనగా క్రతుసద్గ్రహాధిపా = యజ్ఞ వాటికాధికారులచేత, అమేయ-తక్కువ కానట్టిన్ని, ఘన- యెక్కువయినట్టిన్ని, అపరాభిదులు-ఇతర నామములను వడసిన వారలును, అమిత్ర-శత్రువులను, నిషూదనతా-మదించుటయందు, అభియుక్త-ఏకీభవించి, భూనాయకా-రాజ్యాధిపులచేత, మాన్య-మన్నింపబడిన, శిష్టకరణాఖ్యులు-శిష్టకరణమను పేర్లుగలవారును, అజాత పద్మపత్రాయత నేత్రజన్యులు అనగా-ఆ విష్ణుమూర్తియొక్క నాభికమలమందు, (అకారో బ్రహ్మవిష్ణీశ) "ఇతి నానార్థరత్నమాలః" జాత-పుట్టిన బ్రహ్మయొక్క, పద్మపత్ర-తామరపద్మములవంటి, ఆయత-విశాలమయిన, నేత్ర-కన్నులయందలి దేజసాంశవల్ల, జన్యులు-పుట్టబడిన వారలును, వీరలు-ఈ లక్షణములుగల శిష్టకరణములు, తత్ కరణాఖ్యను తత్-ఆయొక్క, కరణాఖ్యను-శిష్టకరణమనే నామమును, ఎంతయున్-విశేషముగా, దాల్తురు-వహింతురు.

గీ॥ శిష్టకరణాభిధానులై హృష్టులగుచు।
నిలిచినృపతుల దయచేత నివ్వటిల్లి।
నీతిశాస్త్రప్రవీణులై నియమమెసగ।
భవ్యులై యుందురుద్యోగపటిమగలిగి॥ "వేదనారాయణ"

శ్లో॥ కస్యప్రజాపతే రాయేలాభేయస్మాత్ ప్రవర్తితః।
తస్మాత్కాయస్థమిత్యాహుచ్చిత్రగుప్తంచ సూరయః॥
చిత్రేణరక్షతత్వాంచ చిత్రగుప్తమథోవిదుః।
యమస్యకరణం సోయంవదంతీతన్మహోషిణాం।
భూమిస్థప్రాణినాం పాపపుణ్యలేఖాధికారిణం।
స్థితంసంయమనీ పూర్వం చిత్రగుప్తం ప్రవతిస్తతః॥

ప్రజాపతి యొక్క ఆయవ్యయ కార్యములయందొక దేవర్షి ప్రవర్తించుటచే నాతడు కాయస్థుడాయెను. ఆశ్చర్యకరమగు సకల రక్షణ చిత్రప్రచారుడగుటచే వానినే పండితులుచిత్రగుప్తుడందురు. భూలోకములోని ప్రాణికోట్లయొక్క పాపపుణ్యములను సంయమనీ పురంబున వ్రాయుటగుర్తెరిగియుండుటచే మహాఋషులు వానినే కరణమని నుడివెదరు.

శ్లో॥ ఋషీణాం చిత్రగుప్తస్యకాయే స్థిత్యయతో భవేత్।
తతః శ్రేష్ట భవత్పూర్వం
కాయస్థబ్రాహ్మజాతికః।
కస్యప్రజాపతేరాయే
లాభేయస్మాత్ప్రవర్తితః॥
తస్మాత్ కాయస్థమిత్యా
హుచ్చిత్రగుప్తంచ సూరయః। (కూర్మపురాణము)

ఋషులలో ఒకడైన చిత్రగుప్తఋషి సకాయలయొక్క పాప పుణ్య వివేచనచేయుటచే కాయస్థుడాయెను. తానుబ్రహ్మజాతిలో శ్రేష్టుడగుటచే శిష్టకరణమాయెను. బ్రహ్మయొక్క ఆయవ్యయము

లయందు ప్రవర్తించుటచే దేవఋషియైన చిత్రగుప్తుడు కాయస్థుడాయెను. కూర్మపురాణములో శిష్టకరణములు బ్రాహ్మణులని ప్రమాణం కలదు. పరాశరస్మృతిలో నిజాతి బ్రహ్మతేజస్సుననుండినుద్భవించి, చిత్రగుప్తవంశస్థులై, దేవతాంశము వలన బ్రాహ్మణులని చెప్పబడినది. ప్రజాపతి నీచిత్రగుప్తఋషిని సృష్టిచిత్రంబులు వ్రాయుటకుగాను నియమించి చిత్రగుప్త కాయస్థుడని పేరునుడివె. అంత భూలోకంలోనట్టిచిత్రవిచిత్రములైన లౌకిక వృత్తులకుగాను ఆకమల గర్భుండు తననేత్రదృష్టినుండి సృష్ట్యర్హమగునొక తేజస్సునుదీసి లేఖనగణనాద్యర్హమగు చిత్రగుప్తుని తేజస్సుతో జేర్చి భగవధ్యానాద్యర్హ పరాశరఋషి తేజస్సుతో యేకీభవింపచేసి పురుషునొకని సృష్టించె కావున ఆతడు శిష్టకరణ చిత్రగుప్త కాయస్థుడనబడును.

చ॥ అటదగు చిత్రగుప్తులని
జాంశముదాలిచి వాణి పాణులన్
పటువహనార్హమైతను సు
పర్వ కిరీటమణిచ్ఛవిచ్ఛటో
ద్భటరుచి వెల్గుబ్రహ్మముఖ
పద్మమునందు విలాసమొప్ప నం
దట నుదయించె శిష్టకర
ణంబుల జాతము సొంపుపెంపునన్॥

టీక॥ అటు = ఆస్వర్గలోకమునందు, తగు = ఒప్పిదమయిన, చిత్రగుప్తుల = యముని మంత్రులయొక్క, నిజాంశముదాలిచి, నిజ = స్వకీయమయిన, అంశము = తేజోభాగము, దాలిచి = ధరించి, వాణిపాణులన్ = విద్యాదాతృత్వమును, పటు = దృఢముగా, వహన = ధరించుటయందు, అర్హమై = తగినట్లు, తను = దేహములు గల, సుపర్వ = దేవతలయొక్క, కిరీట = మకుటములయందలి మనిచ్ఛ = విచ్ఛటా మణి = మణులయొక్క, ఛవిచ్ఛటా = కాంతిఘటలు చేత, ఉద్భటరుచివెల్గు =

ఎక్కువయిన ప్రకాశము చేత తేజరిల్లిన, బ్రహ్మముఖపద్మమునందు = ప్రజాపతియొక్క ముఖపద్మములో, విలాసమొప్పన్ = ఉల్లాసమొప్పునట్లు, అందు = ఆముఖమునందు, అటన్ = ఆవిలాసార్హమయినస్థలమునందు, సొంపు పెంపునన్ = సౌందర్యవిశేషముచేత, శిష్టకరణంబులజాతము = శిష్టకరణకులము, ఉదయించెన్ = జననమయ్యెను.

శ్లో॥ కాయస్థః శిష్టకరణాః బ్రాహ్మణా వై నసంశయః।
సదాచారజనం హిత్వా రాజన్యైః మంత్రిణస్థితాః॥

శిష్టకరణములుత్తమప్రవర్తనులై సద్బ్రాహ్మణులగుటచే వీరిని దేశాధిపులు మంత్రులనుగా నిడుకొనిరి.

శ్లో॥ ఋషీనాం చిత్రగుప్తస్య కాయే స్థిత్యాయతో భవేత్॥
తస్మాత్ కాయస్థయిత్యే తన్నామలోకే ప్రతిష్ఠతః॥
కరణం క్షేత్రమే తేషాం శిష్టం యస్మాత్ప్రకీర్తితం।
తతస్తే శిష్టకరణలోకేఖ్యాతః ప్రతిష్ఠితాః॥

చిత్రగుప్తఋషియొక్క శరీర సంబంధుడగుటచే కాయస్థుడనియు నింద్రియాంతః కరణములను శిష్టవర్తనకు దెచ్చుటచే శిష్టకరణమనియు లోకులందురు.

క॥ నరపతి హరిపతి గజపతి।
పరకార్య దురంధర ప్రవర్తకులై నీ।
ధరణింబ్రసిద్ధిగాంచిన।
కరణంబులలోన శిష్టకరణకులజులున్॥ (నలచరిత్రము)

ఇట్లు చెప్పబడియున్నది గాన నీకరములలో శిష్టకరణంబులు కళింగ దేశ గజపతుల రాష్ట్రమునలోనుండి మంత్రాంగములు

మొదలు గాగ్రామోద్యోగ ప్రవృత్తులలోనం(బవర్తింపు చుందురు.

## ఇతర కరణ శాఖావివరము

శ్లో॥ పూర్వం మారుతకన్యాం
వైకాయస్థః పరిణీతవాన్స్వయం।
తస్యతస్యాంతుయః పుత్రః
శిష్టకాయస్థ సంజ్ఞకః॥ (భవిష్యపురాణము)

ప్రధమత దేవతాంశ స్త్రీయగు మారుతకన్యను కాయస్థుడు వివాహము చేసుకోగా నాకన్య గర్భమందుద్భవించిన యతడు శిష్ట కాయస్థుడాయెను.

శ్లో॥ పునః సంతతిరక్షాయె గృహితాయాం పృధక్ పృధక్।
మహిషాంబష్ట సూతానాం కన్యకాస్తుమశోభనాః॥
తాసనాప్తనాస్తుయేపుత్రాః కాయస్థస్య మహాత్మనః॥
తేమాతృ సంజ్ఞప్రధితాః సూతద్వ్యభిన్న జాతికాః।

ఇతి భవిష్యపురాణ వచనప్రమాణేన రాజకన్యామహిష్యాం బష్టసూతభ్యో మహిష్యాంబష్ట సూతనామానః పుత్రశ్చప్తనః॥

పిమ్మట యీ దేవాంశ కాయస్థులైన ముగ్గురుపుత్రులు రాచ కన్నియలను బరిణయమైరి. వారివలన నుద్భవించిన పుత్రులకు తల్లు లను బట్టి అంబష్టుడు, మాహిష్యుడు, సూతుడను నామంబువచ్చెనని భవిష్యపురాణములో చెప్పబడియె కావున నీముగ్గురి సంతతి వేరు వంశంబులాయె.

గీ॥ పరగ మూర్థావషిక్తులంబష్టులును ని।
షాదులను వారు రాజ వైశ్యసతులందు।

బరగ శూద్రవనితయందు వరుస విప్ర।
కులజునకు గల్గినట్టి వారలుదలంపా॥

వీరలు అంబష్టకరణములు.

గీ॥ క్షత్రియునకు వైశ్యజాతివానికి విప్ర।
కులము వనితవలన గలిగినట్టి।
వారు వరుస సూతవైదేహకులనంగ।
దెలియబడుదు రవని జలజనాభా॥

వీరలు సూతకాయస్థులు

గీ॥ క్షత్రియునకు వైశ్యసతియందు మరిశూద్ర।
కన్యయందు వరుసగల్గినట్టి।
మనుజులెన్నబడుదు రనఘ మహిష్యోగ్ర।
జాతులనగ ధర్మశాస్త్రములను॥ (స్మృతిసారం)

వీరలు (వైశ్య) మాహిష్యకాయస్థులు.

వీరలలో సూతకాయస్థులుత్తర దేశమునందును, అంబష్టకాయస్థులు పశ్చిమ ప్రాంతములందును, మాహిష్య కాయస్థులు దక్షిణదేశమునందును, శిష్టకాయస్థులు బంగాళమునందును, శిష్టకరణముల పూర్వదేశమునందును నివసించి యుందురని పద్మపురాణములో చెప్పబడియె.

కాయస్థసంజ్ఞక కరణజాతీయ వ్యవస్థా స్థాపనవ్యగ్రధీగన్యాత్ కరణాఖ్యాం సమాగతానాం శూద్రవైశ్యాది జాతినాం వణిక్కర

ణానాం పృథక్త్వ్యం సప్రమాణేనరభతే॥ (భవిష్యపురాణము)

శూద్రస్త్రీకిని వైశ్యపురుషునికిని పుట్టినవారలు వణిక్కరణము లని పిలువంబడి వ్యాపారవృత్తులతో వైశ్యకరణములనబడుదురు. ఈశాఖవారు వారలు నివసించియుండు దేశములననుసరించి దుబ్బాయి కరణములు, కనకపిళ్ళలు, మాగధకరణములు, శ్రీనివాసకరణములు విదేహాకరణములను నామంబులతో ముసద్దీ వృత్తులందు చెలగు చుందురు.

శ్లో॥ శూద్రావిశస్తు కరణాంబష్ఠ వైశ్యాద్విజన్మనః।
ఇత్యమరః॥

ఈ వైశ్యకరణములే అమరములో కరణశబ్దవాచ్యులై వక్కా ణింపబడిరి

గద్య॥ ఇది శ్రీమద్గోపాలకృష్ణ పరబ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ద విద్యావైభవ కాత్యాయని సూత్రయాజ్ఞ వల్క్య
గోత్రగౌడ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి
రంయాఖ్య చతుర్థతనయ నయగుణవిధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కలవిప్రవంశప్రదీపిక
యను గ్రంథంబునందు
ప్రథమాధ్యాయము

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ

# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## ద్వితీయాధ్యాయము

### వ్యవహారకాండ

విద్యలను వ్రాయుట, చదువుట, రాజసభలయందు విచారించు అసాధ్య కార్యంబులను జక్క-జేయుట, గణిత శాస్త్రములందు సూక్ష్మబుద్ధిని గలగివర్తించుట, ఇత్యాది ధర్మములచేతను, "శిష్ట" అను భావము చేతను చిత్రగుప్త వంశస్థులైన కరణంబులు నీలోకంబున విఖ్యాతిని పొందుదురు.

"శిష్టాని వ్యతిరిక్తాని అధీత్య పఠిత్వా-శిష్టావిశంతికా భవతి"— శిష్టేషువా-శిష్టభాగాః ప్రవేశయోగ్యాః-శిష్టాఅష్టావింశతి గణనాం పూరకాః - సర్వశ్రేష్ఠో భవంతి-ఉపగ్రంథవినియోగః పఠితారః శిష్టకరణాః - శిష్టకరణః
(కమలాకరభట్టప్రణీత "చణవ్యూహము")

శిష్టకరణములకు ఆదిపురుషుడైన చిత్రగుప్తఋషి - పరాశర - బ్రహ్మ - యేతన్మూర్తిత్రయుల తేజసాంశ సంశ్లేషనచేత జనితులై ఈభూలోకములో భూపతులయొక్కయు లోకులయొక్కయు గుప్తములగు చిత్రవిచిత్ర కార్యములను చక్క-జేయుచు ఈశిష్ట కరణ కాయస్థులు ప్రవతిన్పుచుందురు.

శ్లో॥ కాయస్థశ్చిత్రగుప్తాంశః
బ్రాహ్మణోపిన సంశయః।
నృపాణాం వ్యవహారాయ
సురశ్రేష్టేన యోజితః॥ (భవిష్యపురాణము)

(బ్రాహ్మణులైన కాయస్థ – శిష్టకరణములను – ఇంద్రుడు – భూపతుల వ్యవహారముల నిమిత్తము నియమించెను.

ఈ శిష్టకరణాన్వయ సంఘమువారలుత్కల దేశమునుండి కళింగ దేశమునకు వచ్చి భూపతులవద్ద మంత్రులై కార్యములను చక్కజేయుచుండిరి. తదుపరి ఆంగ్లేయప్రభుత్వములో ఇంగ్లీషువిద్యాప్రబలమై తమ తమ ఆది విద్యలు నానాటికిక్షీణదశకువచ్చి యుండుటచేత భూపతులు ఆంగ్లేయవిద్యా ప్రవీణులను తమతమ వ్యవహారములు చక్కజేయుటకుగాను మంత్రులుగా యేర్పరచుకొనుటచేత ఈ శిష్టకరణములు మొట్టమొదట ధనమదాంధులై నింగ్లీషువిద్య నభ్యసింపక క్షీణదశకువచ్చి మంత్రాంగములను చాలా రాష్ట్రములలో విడిచినప్పటికి విస్తారముగా గ్రామవుద్యోగస్థులై ముసద్దీప్రవృత్తులచే ప్రవతిన్చు చుందురు. వీరియొక్క యోగ్యసాంప్రదాయకమును బట్టియు పూర్వోన్నత స్థితినిబట్టియు ఆంగ్లేయ ప్రభువులు గూడా దయాళువులై తమ విద్యా సుంకమును తగ్గించి ఈ సంఘమువారికి విద్య కరపుటచే చాలామంది ఆంగ్లేయ విద్యాప్రవీణులై తగు ఉద్యోగములుచేయుట కవకాశము చిక్కినది.

## వీరిమొదటి మంత్రాంగ స్థానములు

సంస్థానము పేరు. దివాను పేరు.

1 మాడుగుల – చక్రధరమహాంతి లింగయ్య పట్నాయక్.

2 అనకాపల్లి – శేఖరమహాంతి ఆనందపట్నాయక్.
3 శృంగవరపుకోట- పాణిగ్రాహి మహాంతి కృష్ణమహాంతి ప॥
4 విజయనగరం- పక్కి వెంకటనర్సయ్య పట్నాయ్కు.
5 చీపురుపల్లి- కుప్పిలి దాలయ్య పట్నాయ్కు
6 పాలకొండ- యెల్లుమహాంతి పరశురామపాత్రో.
7 బొబ్బిలి- పట్నాయకుని రామయ్యపట్నాయ్కు.
8 సాలూరు- పక్కి లక్ష్మీనర్సయ్యపట్నాయ్కు
9 పాచిపేట- త్యేడచిట్టియ్యపట్నాయ్కు
10 చెముడు – డొంకాడ జయరామయ్య పట్నాయక్.
11 మక్కువ – భోగిల వెంకయ్య. మక్కువనీలయ్య పట్నాయక్.
12 పార్వతీపురం – పాత్రేరు అప్పయ్య పట్నాయక్.
13 సంగంవల్స – మక్కువ రామస్వామి పట్నాయక్.
14 మేరంగి – బెహారా దాలయ్య పట్నాయక్.
15 జయపురం – రాధాక్రిష్ణ గోపినాధో పట్నాయ్కు.
16 కురుపాం – నడుకూరి రంగనాయక పట్నాయ్కు
17 సిర్లాంకోట జమీన్దారు పక్కి వెంకటరావు పట్నాయ్కు

ఈపై చెప్పిన జమీలన్నియు గొలుగొండ నవాబుగారి ; పాలనలో నుండునపుడు శ్రీకాకుళం తఖ్తుకు షేకుమహామ్మదుశ సాహెబు గారి తదనంతరము అనగా 17వ శతాబ్దములో (164 కుప్పిలి కూర్మయ్య పట్నాయకులుగారు సుబునవాబుగా కొం కాలము రాజ్యాంగము చేసిరి. వారి తదనంతర మీయాంగ్లేం ప్రభుత్వ మీదేశపరిపాలనకు వచ్చినది.

జీవకోటియొక్క పాపపుణ్యములను పరిశీలించుటకై బ్రహ్మన

చిత్రగుప్త ఋషి యెట్టికార్య వాదముల జరపుచుండునో యటులనే భూలోకములో భూపతులవద్ద చిత్రగుప్తవంశజులైన శిష్టకరణ ములజులు ప్రవర్తించినట్టు పైని వివరింపబడిన యుద్యోగములనుబట్టి తేటతెల్లమైనది

ఈపంచగౌడ బ్రాహ్మణులలోని చిత్రగుప్త వంశజులైన శిష్టకరణ శాఖవారలనే లౌకికవ్యాపారమునిమిత్తమై పంచద్రావిడ బ్రాహ్మణు లలో నియోగింపబడిన శాఖస్థులుగూడ వ్యాపారకరణములనియు, నియోగ కరణములనియు నామంబులు వహించి మతాంగ ప్రము గ్రామోద్యోగాది మునద్ధిధర్మములలో ప్రవర్తింపుచుందురు.

ఈభరతఖండములో శిష్టకాయస్థ కరణములు ఉత్తరాపథ లౌకికులనియు, నియోగ కరణములు దక్షిణాపథ లౌకికులనియు, శిష్టకరణములు పూర్వాపథలౌకికులనియు, వ్యాపారకరణములు పశ్చిమాపథ లౌకికులనియు వ్యవహరింపబడుదురు.వీరందరు వేద వేత్తులై త్రికర్మాధికార బ్రాహ్మణులై వర్తింతురు.నియోగ కరణములు, వ్యాపారకరణములు ఆంధ్రదేశనివాసులగుటచేపంచ ద్రావిడ బ్రాహ్మణశాఖస్థులైరి.శిష్టకరణములు, శిష్టకాయస్థ కరణములు. గౌడదేశ వాస్తవ్యులగుటచే గౌడబ్రాహ్మణ శాఖస్థులైరి.

శ్లో॥ దక్షిణేపూతులాకన్య పశ్చిమేచర్మపాణియో॥
ఉత్తరేమహిషభుక్తంచయామ్యేమత్స్యభుక్తిషు॥

అను లోకోక్తి ననుసరించి పైనాల్గు శాఖల కరణములకు

పరస్పర భోజన ప్రతిభోజన సంబంధ బాంధవ్యాది వ్యవహారములు లేవు.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణపరబ్రహ్మ కరుణా కటాక్ష
లబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్రయాజ్ఞ వల్క్య
గోత్రగాఢ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి
రంగయాఖ్య చతుర్థతనయ నయగుణవిధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కల విప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
ద్వితీయాధ్యాయము
సంపూర్ణం.



శ్రీ

# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## తృతీయాధ్యాయము

### బిరుదావళికాండ

శిష్టకరణకులజులు గంజాం విశాఖపట్నం జిల్లాలలో విస్తరించి నివసించియుందురు. వీరు 'పట్నాయక్'' 'మహాపాత్ర' 'శర్మ' 'మహాంతో'-'పాండితో' 'మొంతి' 'బైణికో' అనుపౌరుషనామములు వహించెదరు.

శ్లో॥ సాక్షాత్క్షత్రియధర్మాణిధీమంతశ్చైవకీర్తితః।
తేషాం వైశస్త్రభేదేన దత్తాశర్మేతిచేచ్యతే॥

రాజులకు సర్జన పర్జనంబులు చేయుటచే శిష్టకరణములు "దీమంతో" అనియు శస్త్రభేదవిద్యను గరపుటచే శిష్టకాయస్థులు "దత్త" అనియు, శిష్టకరణములు "శర్మ" అనియు బిరుదులు వహింతురు.

శ్లో॥ మాతృకుక్షిం సమాశ్రిత్య గుప్తోయస్మాద్భవేత్యవై॥
తస్మాత్ గుప్తేతి నామాసిల్లోకేఖ్యాతః ప్రతిష్టితాః॥

(భవిష్యపురాణము)

మాతృకుక్షియందు ప్రవేశించి గుప్తముగా నుండుటచే సూత్రాది త్రివిధకరణములు "గుప్త" అనియు బిరుదును వహింతురు.

శ్లో॥ పితుర్వ్యచిత్ర సంబంధాం చిత్రమాహిష్యకః స్మృతః।
భగవాన్ దాసభావేన కేచిందాసేతితాన్ విదుః॥

(భవిష్యపురాణము)

తండ్రి అష్టపురుషుండు గాన మహిష్యాంబష్ఠాది మహాంతికరణములు భగవంతుని సదా ధ్యానించుటచే 'దాసు' అనియెదరు.

నీలాగున బిరుదావళులు భవిష్యపురాణములో వక్కాణింపబడియె. గ్రంథ బాహుళ్యముచేత తక్కిన బిరుదులు యాపురాణములలో విడిచినప్పటికి పద్మపురాణములో కరణములయొక్క వ్యవహారాది విధానమంతయు వక్కాణించి యున్నది. అందులో కరణములకు 'పట్నాయక్' 'రాజదత్త' 'పాత్రో' అను ఇత్యాది బిరుదావళులు గలవు.

శ్లో॥ మహాబుద్ధితయాశేతు మహాంతానయిస్మృతః।
స్వజాత్యుత్కర్ష భావ్యంగతే శిష్టకరణంమతః।
నపత్కం ప్రాప్యశటీకాం పట్టనాయకతం గతాః।
శిష్ట్యాధ్యయన కారిత్వే నాయకః పరికీర్తితః।
కేతులోకే మహాఖ్యాత మహాపాత్రస్మృతాం మతః।
మహాయోగ్యత్రియాతేతు మహాపాత్రోతియారితః।
లగ్రహణయిత దాతర్వదం లభీతిమర్దలాః।
మర్దిలవాదనాంచంతు వీణావాదన వైణికః॥

మహాబుద్ధిమంతుడగుటచే 'మహాంతి' స్వజాతీయుల నుత్కృష్ట సాధనంబులం జేయుటచే శిష్టకరణంబులు రాజులను పట్టాభిషిక్త వేళలందు పట్టు(కిరీటము) ధారణ చేయించువారు గాన 'పట్నాయక్' శిష్యులకు విద్యగరవుటచే "నాయక్" లోకమునందు మంచికీర్తిని వహించుటచే 'మహాప్రశస్తి' మహాయోగ్యులగుటచే 'మహాపాత్రో' సంగీతమృదంగాది వీణలందు ప్రవీణులుగాన "[illegible]" అని యిత్యాది బిరుదులతో వీరలు నీలోకములో సంచరించెదరు.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణపరబ్రహ్మ కటాక్ష
లబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్ర యాజ్ఞవల్క్య
గోత్ర గౌడ బ్రాహ్మణ శిష్టకరణ వంశోద్భవ [illegible]లి
రంగయాఖ్య చతుర్థతనయ నయగుణాభిధేయ
కృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన
శ్రీమదుత్కల విప్రవంశ ప్రదీపిక
యను గ్రంథంబునందు
తృతీయాధ్యాయము
సంపూర్ణం.





# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## చతుర్థాధ్యాయము

### కర్మకాండ

శ్లో॥ సంస్కారైః శోధయేనిత్యం
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకానితి।
స్మృతిసంబోధితాయా సంస్కారవిద్యాం
బ్రాహ్మణానాం క్షత్రియస్యవైశ్యస్యచాధికారః॥

ద్విజులైన బ్రహ్మక్షత్రియ వైశ్యులు పంచ సంస్కారనియామకులు.

శ్లో॥ జాతకర్మాదిభిర్యస్తు సాంస్కారైస్సం స్కృతశ్శుచిః।
వేదాధ్యయన సంపన్నష్షట్కర్మస్వవస్థితః।
శౌచాచారస్థితస్సమ్యగ్విఘసాశీ గురుప్రియః।
నిత్యవ్రతీసత్యపరస్సవై బ్రాహ్మ ఉచ్యతే॥

ఎవడు జాతకర్మ మొదలయిన సంస్కారములచే సంస్కరింపబడినవాడో-శుచిగలవాడో - షట్కర్మనిరతుడైనవాడో - పరిశుద్ధమైన ఆచారములు గలవాడో దేవతులకు అతిథులకు నివేదనమయిన పదార్థమును భుజించువాడో, గురువునందు విశ్వాసముగలవాడో

నిత్యవ్రతముగలవాడో, సత్యమందాసక్తిగలవాడో, వాడు బ్రాహ్మణుడుగా చెప్పబడుచున్నాడు.

శ్లో॥ సత్యదానమథాద్రోహ ఆవ్యశంస్యంత్రి పాఘృణా।
తపశ్చదృశ్యతేయత్రి సబ్రాహ్మణ ఇతిస్మృతః॥

సత్యము, దానము, ద్రోహముచేయకుండుట, అపకారారాహిత్యము, లజ్జ, దయ, తపస్సు ఎవనియందు కనబడుచున్నదో వాడు బ్రాహ్మణుడుగా చెప్పబడియె.

శ్లో॥ సర్వభక్ష్యరతిర్నిత్యం సర్వకర్మకరోశుచిః।
త్యక్తవేదస్త్వనాచారస్సవై శూద్రం ఇతిస్మృతః॥

ఎల్లపుడు ఎవడు సమస్తమునుభక్షించుట యందాసక్తి గలవాడో అన్నివిధములైన కృత్యములుచేయువాడో, చెడునడువళ్ళను గలవాడో, వేదాధ్యయనమును చేయకుండువాడో అనాచారము గలవాడో, వాడు శూద్రుడని చెప్పబడును.

శ్లో॥ శూద్రేచైతద్భవేల్లక్ష్యం ద్విజేతచ్చన విద్యతే।
సవై శూద్రోభవేచ్ఛూద్రో బ్రాహ్మణోబ్రాహ్మణోచనః॥

ఈ పైనుదహరించిన గుణములు శూద్రునియందు లేనియడలను వాడు శూద్రుండుగాడు. ఇట్టిగుణములుగలబ్రాహ్మణుడు శూద్రుడే గాని బ్రాహ్మణుండు గ డని మహాభారతము శాంతిపర్వములో భారద్వాజఋషి భృగుఋషితో చెప్పెను.

శ్లో॥ బ్రాహ్మణంతు స్వయంకుర్యాః
సంస్కారాన్ వేదచోదితాన్।
తేషాం వేదోక్త కార్యేషు సాక్షాన్ ముఖ్యాధి కారతః॥

ఇతి స్మృతి వాక్యసారాత్ బ్రాహ్మణైః స్వయం సంస్కారః క్రియంతేన తేషామితరాపేక్షా అత్రవాక్యాంతర మవిప్రమాణః॥

బ్రాహ్మణుని వేదాధికారమునుండుటచే వేదోక్తముగా సంస్కారము తాను స్వయం చేసికొనును. ఈప్రకారముస్మృతిచెప్పుచున్నది

శ్లో॥ ఇతరాపేక్షేరాన్ కర్మకుర్యు జాతీయః।
వేదాధికారిణయస్మాత్ భూసురాస్తే ప్రకీర్తితః॥

బ్రాహ్మణుడు ఇతరాపేక్ష లేకనే సంస్కారవిధి తాను స్వయముగ చేసుకొనుటచే భూసురుడని పిలువబడును.

శ్లో॥ క్షత్రియస్య తథావైశ్య వేదోక్తేకర్మణిస్థితే।
నిమన్యః బ్రాహ్మణాన్ పూర్వంతతో వైకారమేత్తథా॥

గాన బ్రాహ్మణులలో త్రికర్మాదికారము గలవారు తదితర ద్విజులైన క్షత్రియ వైశ్యులు షట్కర్మాధికారముగల బ్రాహ్మణుల నియమించుకొని వారిచే కర్మలను వేదోక్తముగా జరిగించుకోవలయుననియు,

శ్లో॥ క్షత్రియాయదివావైశ్యాః కుర్వితే వైదికంతుయత్।
తేనదోషం లభంతే తేనఫలంహితమాత్మనః॥

వైదికకర్మ తాము స్వయముగ జరిపేయడలనది దోషయుక్తమని బృహన్నారదీయములో చెప్పబడియున్నది. దోషము సంభవించుట యోగాక నట్టి కర్మ వినియోగపడ నేరదు గాన మధ్వర్యాధికారము గల బ్రాహ్మణునిచే పంచ సంస్కారంబులు చేయించుకొనుట కర్తవ్యంబని కూర్మపురాణములో చెప్పబడినది.

శిష్టకరణంబులు గౌడసాంప్రదాయంబును విడువక వేదోక్తోపనయన వివాహాది పంచ సంస్కార కర్మలను మతానుసరణ దేవ పూజానానుష్ఠాన వ్రతంబులను సతతంబు చేయుచుందురు.

---

## 1 విద్యారంభః

ఆచార్యుని నుచ్చరించి వినాయక సరస్వతీపూజలను జేసి లేఖన పూజ చేయునది. పిమ్మట గురువునకు వస్త్రాలంకారములచే పూజ చేసి విద్యారంభణ చేయునది. బాలునిచే మొదట, సరస్వతీదేవిని స్మరియింపజేయునది. ఈకర్మ ఉపాధ్యాయ కరణము లేనొనప్పుట కధికారముకద్దనిపరాశర స్మృత్యుక్తి కలదు. గాన నీవిద్యాగురువుల చేతనే నీకర్మలోకంబునందు అనాతసిద్ధముగ జరుగుచున్నది.

శ్లో॥ కాయస్థః శిష్టకరణః సంస్కారిణోయది।
తదా తేయోగ్యతామ పూర్వివిద్యారంభే చవై ద్విజః॥

ఇతి భవిష్యపురాణవచన ప్రమాణేన సంస్కారాన నంతరం కాయస్థ శిష్టకరణాదినాం విద్యారంభే భవతి.

భవిష్యపురాణములో శిష్టకరణములు విద్యారంభ కర్మ చేయించుటకు విధి కనబడుచున్నందున వారలు ద్విజులనుటకు సందియంబు లేదు. శిష్టకరణంబులు బ్రహ్మఋషి సంతానులై ఋషిగోత్ర ప్రవరలను గలిగి పంచ సంస్కారాది కర్మలను వేదోక్తముగా జరిగించుకొందురు. వీరలార్యులు మొదట గంగానదీ తీరమునయున్న నుత్కలదేశమునుండి కళింగదేశమునకు వచ్చిరి వీరలు సామవేదులు కాత్యాయన సూత్రిజ్ఞులు, గౌడశాఖవారు ఈకళింగ దేశములో కొన్ని భాగంబులందు గౌడశాఖ వైదిక బ్రాహ్మణులు లేకపోవుటచే నాయాస్థలాచారములంజేసి ఆయా వేదములు, సూత్రములచే కర్మ వేదోక్తముగా జరిగించుకొందురు. కాత్యాయనీ సూత్రిజ్ఞులు గౌడ సాంప్రదాయకులగుటచే వారియొక్క ఆర్యదేశాచార నడువళ్ళను విడువక ఆచరించుచుందురు.

శ్లో॥ జాతివిప్రోదశాహేన ద్వాదశాహేన భూమిపః।
వైశంపంచదశాహేన శూద్రమాసేన శుధ్యతి॥

అనగా మృతశౌచికము బ్రాహ్మణులకు పది దినములు- క్షత్రియులకు పండ్రెండు దినములు, వైశ్యులకు పదునైదు దినములు, శూద్రులకు నెల దినములు జరుగుచున్నది. ఇటువలెనే శిష్టకరణములకు మృతాశౌచము పది దినములతో శుద్ధమగుచున్నది. శిష్టకరణములుత్కల బ్రాహ్మణులగుటచే వీరికి ద్రవిడ బ్రాహ్మణులకువలె గృహనామములు లేవుగాని వీరలు విస్తరించి కళింగ దేశమునందలి గ్రామములలో వసించియుండుటచే నాయా గ్రామ నామములను సంజ్ఞార్థమై తమ తమ గృహనామములుగా వాడుకొనుచున్నారు, గాని అవి స్థిరములైనవిగావు. గనుకనే వివాహాది కార్యములు జరి

గించునపుడు తమ తమ గోత్ర సూత్రప్రవరుల ననుసరించి సంబంధ బాంధవ్యము ను జరపుకొందురు. వీరలగోత్రములు, ప్రవరములు. ప్రవరకాండములలో సవిస్తరముగా వక్కాణింపబడినవి

---

## 2 ఉపనయనః

### ఉపనయన కాల నిర్ణయము.

అష్టవమన్ం బ్రాహ్మణం ముపనీయతే-యాజ్ఞవల్క్యః గర్భాష్ట మేవ నవమేవ బ్రాహ్మణః స్యూపనయనం॥

బ్రాహ్మణునికి గర్భ సంవత్సరము మొదలుకొని ఎనిమిదవ సంవత్సరమున గాని తొమ్మిదవ సంవత్సరమునగాని ఉపనయనము చేయవలయునని యాజ్ఞవల్క్యస్మృతియందు చెప్పబడియున్నది.

మూ॥ఆషోడశ శాద్బ్రాహ్మణస్య సావిత్రీనాతి వర్తతే।
అతఊర్ధ్వంత్రయోప్యతే యథాకాలమ సంస్కృతా।
సావిత్రీ పతితావ్రాత్యాభవం త్యార్యవిగర్హితాః॥

(మనుధర్మశాస్త్రము)

బ్రాహ్మణులకు పదునారు సంవత్సరముల వరకును ఉపనయనము ఆ సందర్భములో చేయనియెడలను సావిత్రీమంత్రమునకు యోగ్యులై జాతిబహిష్కృతులై సజ్జనులచే పరిగ్రహింపబడరు.

## ఉ ప న య న  క ర్మ వి ధి.

ఈకర్మ బ్రాహ్మణులకు రెండు దినములలో సమాప్తి యగును. మొదటి దినమునందు :-

(1) పుంసవనము: గర్భ సంస్కారము రెండవ, మూడవ మాసము, పుష్యనక్షత్రమున గర్భపిండమును సంస్కారము చేయవలసియుండును గాన కాల మతిక్రమించుటచే నీదోషమునకు ప్రాయశ్చిత్త హోమము జరుగబడును. తరువాతను దేశకాలానంతర సంకల్పము, పంచభూసంస్కారములచే హోమము జరుగబడి తరువాత పుణ్యాహవచనము, మాతృపూజ, వసుద్ధార, అభ్యుదైక శ్రాద్ధము తల్లిదండ్రులచే ఉపవాసముతో జరుపబడును. ఈకర్మ పూర్తి అయిన తరువాతను దశబ్రాహ్మణ భోజనము ఆశీర్వాదము జరుగబడును.

(2) సీమంతము: అధివాసభా[illegible]సోల రూపణ అనగా మంగళారోపణము అయిన తరువాతను మంటపమునకు ఈశాన్యభాగమును పాతాళ పూజనిమిత్తము రెండురాటలు పాతబడును. పిమ్మట సగుణ పూజ, పుణ్యాహవచనము, హరిద్రాలేపనము, ఆశీర్వాదము, అభ్యుదైక శ్రాద్ధము, మాతృపూజ, వసుద్ధార తదితర లౌకిక వ్యవహారములు జరుపబడును. తల్లిదండ్రులు నూతనవస్త్రములను ధరింతురు. సీమంతము యేడవమాసములో జరుగనందుకుగాను ప్రాయశ్చిత్త హోమము జరుగబడును, మార్జనము, ఆచార్యదక్షిణ, నాందీశ్రాద్ధము, దశబ్రాహ్మణ భోజనము శాంతికక్షణము, పుణ్యాహవచనము జరుగబడును.

(3) జా త క ర్మ ము : పంచకర్మలు, 1 వరుణపూజ, 2.అభ్యుదైక శ్రాద్ధము, 3.దశదిక్పాలపూజ, 4.మాతృపూజ, 5. వసుద్ధార పిమ్మట సంకల్పము జాతకర కాలాతీతమగుటచే దేవకాలానంతర ప్రాయశ్చిత్తహోమము పంచభూసంస్కారములతో జరుగబడును. పిమ్మట పుణ్యాహవచనము.

ము॥అహాయేకాద శేనామం చతుర్థమాసే నిష్క్రమణ
సష్టేఅన్నప్రాసననేమాసి చూడాకార్యాయథాకులం॥

జాతమయిన పదునొకండవ దినంబున నామకరణము, నాలుగవ మాసములో వహిర్నిష్క్రమణము, (బిడ్డను బైటకు తెచ్చుట, ఉయ్యాలలో వేయుట,ఇత్యాది) ఆరవమాసములో అన్నప్రాశనము కులాచారముచే పిమ్మట చూడాకరణము (చౌలము) అనగా కేశ ముండనము జరుగబడును.

(4) నా మ క ర ణ ము : పైనకాణించిన ప్రకారమా ప్రాయశ్చిత్తహోమాది కర్మలు జరుగబడును.

(5) వ హి ర్ని ష్క్ర మ ణ ము: చతుర్థమాసము అతిక్రమించుటచే పై చెప్పినప్రకారము ప్రాయశ్చిత్తహోమాది కర్మలు జరుగబడును.

(6) అ న్న ప్రా శ న ము : ఆరవమాసములో ఈకర్మ జరుగుట అతిక్రమించుటచే పై చెప్పబడిన ప్రకారము ప్రాయశ్చిత్తహోమాది కర్మలు జరుగబడును.

పై వివరించు నామకర్మలు గృహముయొక్క లోభాగమున మొదటి దినంబున జరుగబడును.

రెండవదినమందు జరుగవలసిన కర్మలు 1. చూడాకరణము (చౌలము), కర్ణవేధనము, 2. ఉపనయనముభిక్ష, 3. ఉపాకర్మము (వేదములు చదువనారంభించుట) 4. సమావర్తనము.

ఈకర్మలు యింటియెదుటి మంటపముపై జరుగబడును.

(1) చూడాకరణము. (చౌలము) కర్ణవేధనము :- కులాచార విధుల ప్రకారము కేశఖండనము జరుగును. ఈకర్మకు సంకల్పము పుణ్యాహవచనము, మాతృపూజ, వసుర్ధార, అనాదేశ ప్రాయశ్చిత్తము, పంచభూసంస్కార హోమము, అభ్యుదైకశ్రాద్ధము, దశబ్రాహ్మణ భోజనము, బొడ్డుపుడకతో దంతధావనము, స్నానము, ఆచమనము, వస్త్రపరిధానము, తిలకాదిగ్రహణముచేసి బాలునికి మంత్రములతో కర్ణవేధనము చేయబడి ఆశీర్వాదము చేయబడును.

(2) 1. ఉపనయనము భిక్షు: వైశ్వదేవపూజ, నగణ పూజ, సంకల్పము, అభ్యుదైకశ్రాద్ధము మాతృపూజ, వసుర్ధార దశబ్రాహ్మణ భోజనము, పంచభూసంస్కారములతో హోమము, దేశకాల పాత్రను సారదానము, బ్రహ్మచారి నియమము, (కౌపీన ధారణము, కటిసూత్రము, యజ్ఞోపవీతము, కృష్ణాంజనీఉత్తరీయము, పాలాశదండము, కుశపటుద్వయము, వీటిని మంత్రములతో ధరించి) సంధ్యావందనము చేయును. పిమ్మట అగ్నిప్రదక్షణము, హోమము, ఆచార్యునిద్వారా బ్రహ్మచారిచే కర్మలను గూర్చి ప్రమాణముచేయించుట, గాయత్రీపుపదేశము.

(3) భిక్షావిషయః. ఎడమచేతితో నూతనకంచు పాత్రను బ్రహ్మచారిబట్టి అందుపై అరటియాకునుబెట్టిలేచుట. అప్పుడు తన మేనమామ సహితము యీపాత్రను తన యడమహస్తముచేబట్టి రెండవహస్తముచే ఉదక పాత్రమును బట్టుట పిమ్మట బ్రహ్మచారి

భిక్షకు ప్రారంభించగా తనతల్లి ప్రథమత భిక్ష వేయును. తదుపరి తనతండ్రి బంధువులు యావన్మంది వరుసగా భిక్షను వేయుదురు. పిమ్మట ఆచార్యుని అనుమతినిబొంది బ్రహ్మచారి తనతల్లికి శాన్త్రి నభిక్షను సమర్పణజేయును. దశబ్రాహ్మణభోజనము, శాంతికరణము పుణ్యాహావచనము, బ్రాహ్మణ దక్షిణ దానములు, ఆశీర్వాదము.

(4) వే దా ర ం భ ః. ఆదినివరుణపూజ, పిమ్మట దేశకాల వాక్యానంతరసంకల్పము, అభ్యుదైకశ్రాద్ధము, మాతృపూజ, వసుద్ధార, శ్రాద్ధములేక బ్రాహ్మణభోజనము, పంచభూసంస్కారహోమము, ప్రాసనము, మార్జనము, బ్రాహ్మణదక్షిణదానము, ఆశీర్వాదము, పిమ్మట అగ్నికి ఉత్తరభాగమున బ్రహ్మచారి తన ఆచారికి నెదురుగా కూర్చొని క్రింద నూతనవస్త్రమును పరచి గురు పాదమునకు సమీపమునందు నారికేళమునుంచి తనహస్తములచే గురు పాదములను బట్టి తనబ్రహ్మచారి నామమును శృతపరచును పిమ్మట గురువు ఆశీర్వాదముజేసి వేదాధ్యయనమును జేయించును తదుపరి వసుద్ధార, దశబ్రాహ్మణభోజనము,అశీర్వాదము, పుణ్యాహావచనము జరుగును,

(5) స మా వ ర్త న ము, ప్రథమతవరుణపూజ, దేశకాలవాక్యానంతరసంకల్పము, అభ్యుదైక శ్రాద్ధము, మాతృపూజ, వసుద్ధార పుణ్యాహావచనము, తిరిగి పంచభూసంస్కారములతో హోమము, ప్రాసనము, మార్జనము, బ్రాహ్మణదక్షిణదానములు. ఆశీర్వాదము అగ్నిప్రదక్షిణ, కుంభాభిషేకము, ద్వాదశాంగుళీప్రమాణముగల బొడ్డుపుల్లతో దంతధావనము, ఆచమనము, క్షురకర్మస్నానము, వాసన ద్రవ్యములచే తిరిగి స్నానము, ఆచార్యుని వద్దనుజేరి గంధ

లేపనము. అలంకార వస్త్రధారణము, కజ్జలము, కుంకుమ, ముకుట బంధనము, దర్పణే ముఖావలోకనము, ఛత్రిగ్రహణము, పావల గ్రహణము, దండగ్రహణము, కుశవటుగ్రహణము, అగ్నివిసర్జనము శాంతికరణము, అచ్ఛిద్రావధారణము, పుణ్యాహావచనము జరుగును తదుపరి బ్రహ్మచర్యముతో తనగృహమును వెడలును. అంత తన మేనమామ వెంబడించి బ్రహ్మచారిని అడ్డుకొని వానిని గృహస్థా శ్రమము పొందుమనియు, తనకుమార్తెను యతనికిచ్చి వివాహము చేయుదునని వాగ్దానముచేసి వానిని దేవాలయమునకు గొనిపోయి నచట దేవతారాధనము చేసి తనగృహమునకు తీసుకొని వెళ్ళును. పిమ్మట మధుపర్కములతో బ్రహ్మచారినిన్ని, వానితండ్రినిన్ని సమాధానముచేయును. బంధుభోజనము జరుగును. తదుపరినిర్ణయిం చిన లగ్నములో వివాహము నీదిగువ నుదహరించు ప్రకారము జరుగబడవలయునని సామవేదములో శంభుకరపద్ధతిలో చెప్పబడి యున్నది.

## ౯. అథవివాహః

అథ బ్రాహ్మణస్య వర్ణానుక్రమేణ చతస్రోభార్యా భవన్తి తిస్రః క్షత్రియస్య। ద్వేవైశ్యస్య। ఏకాశూద్రస్య। తాసాం సవర్ణా వేదనే పాణిర్గ్రాహ్యః అసవర్ణాన్ వేదనేశరః క్షత్రియకనయా। ప్రతోదోవైశ్యకన్యయా। వసనదశాన్తః శూద్రకన్యయా॥

తా॥ బ్రాహ్మణుడు నాల్గువర్ణముల స్త్రీలను, క్షత్రియుడు మూడుజాతుల స్త్రీలను, వైశ్యుడు రెండుజాతుల స్త్రీలను క్రమ ముగా స్వజతి స్త్రీని వివాహమయిన తరువాతను వివాహము

చేసికొనవచ్చును. శూద్రుడు స్వజాతి స్త్రీనొక్కరితనే గ్రహించ వలయునని స్మృతి చెప్పుచున్నది,

మాతులస్యసుతామూఢ్వా మాతృగోత్రాంతథైవచ। సమానప్రవరాంచైవత్యక్త్వా చాంద్రాయణంచరేత్ ॥ అసపిండాచయా మాతురసగోత్రాచయాపితుః । సాద్విజానాం ప్రశస్తా స్త్రీదారకర్మణిమైథునే ॥

తా॥ మేనమామ కుమార్తెనుగాని, తల్లి గోత్రమునందలి కన్యను గాని, తల్లివంశపు ప్రవరతో సమానమయిన ప్రవరగల కన్యను గాని వివాహము చేసికొనియెడల అట్టికన్యను విడిచి చాంద్రాయణవ్రతము చేయదగినది. ఏకన్యతల్లికి సపిండురాలు కాదో యే స్త్రీ తండ్రికి సమానగోత్రముకలది కాదో, ద్విజులకు ఆ స్త్రీ వివాహమునకు తగినది.

స్వగోత్రీకులకును, ప్రవరలు గలయువారలకును పరస్పర వివాహములు లేవు. ఈ విషయమై స్పష్టముగా రాబోవు ప్రవర కాండలో వక్కాణింపబడియె.

## వివాహవిధిః

గౌడబ్రాహ్మణ శిష్టకరణములవిధి నిర్ణయమేమన, పురోహితుని చేత మంగళారోపణ చేయబడి దేవతారాధన వరుణవిధిజరుపబడును మంగళారోపణ అయిన తరువాతను వస్త్రాలంకారములను వేదోక్తముగా పూజించి వరునికి నలంకరించునది. పిమ్మట జలపూర్ణకుంభమును వివాహవేదికకు బూర్వదిశయుండు. సిద్ధిగణత్యాధి దేవతకు

దూర్వాక్షతపుష్పములతో పూజచేసి మాతృగణపూజ, స్వస్తివచనము, అభ్యుదయిక శ్రాద్ధము జేసి బ్రాహ్మణులను యథాశక్తిని దక్షిణలచే సంతుష్టిచేయబడును, భోజ్యాత్ స్వర్గనసుద్దారాది విధులను జరపి బ్రాహ్మణునిచే ద్వితీయవరుణము జరిగించబడును. తరువాతను గంధాది వాసనలు, లవణ చామరము(తలంబ్రాలు బియ్యం) చేసి వస్త్రాలంకరముల సహితముగా అంబికాపూజ యొనరించి కన్యకు తనబంధువులచేబట్ట తెర వేయించివరునిపై లవణాచామరము వేయబడును. వరకన్యకలకు కౌతుకనూత్రములచే పాణిగ్రహణ చేయబడును. బ్రాహ్మణులు వేధవాక్యములు పఠించుచు వరకన్యకలు పరస్పరావలోకనము చేసిన తరువాతను శిలారోహణము చేయబడును. అటుపిమ్మట యథాశక్తిని హోమము చేసి వస్త్రాలంకారములచే పురోహితపూజ యిత్యాది కర్మబ్రాహణ విధిగా చేయవలయునని విష్ణుపురాణములో చెప్పబడియున్నది. శిష్టకరిణకులజులు గౌడ సాంప్రదాయకులగుటచే వారివివాహములు ఆరునొకదినము యీక్రింద వివరించురీతిగా జరుపబడును.

మొదటి దినము:- మంగళారోపణ, పిమ్రవైశ్వదేవవిధి, బోయిసాలారూపణ (పందిరిరాటవేయుట), లవణచామరము (తలంబ్రాల బియ్యము), నాందీశ్రాద్ధము.

రెండవదినము:- లగ్నము, (1) ప్రథమవరుణ, (వరుని గంధాది యజ్ఞోపవీత నూతనవస్త్రధారణచేసి పాదప్రక్షాళన జేసి వానిని కన్యకయింటికి రప్పించుట), (2) కుంభపూజ (దశదిక్పాల పూజ), (3) మాతృగణపూజ, (కళ్యాణమంటపముపై దక్షిణభాగమున పీటవేసి అందుపై అంగవస్త్రమువేసి మొదటిదినమున అనగ

గంధాదివాసములో పుణ్యాంగనలు తయారుచేసిన పసపుగుండ, పోక చెక్కలు అందుపై కొంచమునిచి మాతృగణ స్వరూపములనుఅందు పై లిఖించి పూజచేయుబడును) (4) వసుద్ధార, (నేతితో అయిదు గీతలు కళ్యాణమంటపమునకు సమీపమందున్న గోడకు వ్రాయుట) (5) వాగ్దాన సంకల్పము (కన్యయొక్క తండ్రి పెండ్లికార్యము చేయునని నోటితో వచించుట). తరువాత వరుడు తన విడిదింటికి బోయి యచడనాందీశ్రాద్ధమును జేసి కన్యయొక్క సూత్రమును వరుడు గొనిపోయి కంకణ ధారణమా చేసికొనును. ఆలాగుననే వరుని సూత్రముతో కన్యక తన కళ్యాణమంటపముపై కంకణధారణము చేసికొనును. దీనినే ప్రథమ వరుణయని చెప్పబడును.

ద్వితీయ వరుణ :- వరుడు తిరిగీ స్త్రీరూపముతో కళ్యాణ మంటపమున కేతెంచి హోమము చేయును. తదుపరి వరుడు తన కౌశిక స్త్రీరూపమునువిడచి నూతనవస్త్రములను ధరించి పాణి గ్రహణము చేసికొనును. తతఃపూర్వము వరునియొక్క సంబంధులు కన్యకను తనరూపలావణ్యములనుగూర్చి పరిశీలించెదరు. పాణిగ్రహ ణసమయములో కన్యయొక్క తండ్రి 'కటకమ' అనురాక్షసు నకు కుశదర్భలచే తాను కూర్చొనియుండు ఆసనముక్రింద నుంచు కొనును. తరువాత సంకల్పమొనరించి దేశకాలవాక్యానంతరమందు పాణిగ్రహణము జేయును. స్వతినిమంతనము అనగా అరుంధతి అను నూయాది పుణ్యాంగనలనుచ్చరించి ఆశీర్వచనము చేయుబడును. కన్యావరుణ, లాజ్యహోమము(వరిపేలాలచే హోమమొనర్చి వధూ వరులయొక్క లజ్జను విడగొట్టుట) వరకన్యకలిద్దరు కళ్యాణ మంట పముపై గవ్వలచేనాడి యుభయులు ఇంటి లోభాగమునకు వెళ్ళి యచట సిష్టదేవతాపూజలనొనర్చి గవ్వలచే మరలనాడుట, ఇట్టు

పిమ్మట భోజనాది కృత్యములు జరుగబడును,

మూడవదినము :- బెద్దిపొడియా, ఈదినమందు కన్యావరులచే కళ్యాణమంటపముపై గవ్వల నాడించుటయే గాని తదితర కర్మ యామంటపముపై జరుపబడనేరదు.

నాల్గవదినము :- ఉదయమున అభ్యుదయిక శ్రాద్ధము అనగా కన్యచేతను వండించి వరునియొక్క గోత్రములో కన్యను కలుపుటకుగాను పితృదేవతలకు నివేదన జరుగబడును. నాటిరాత్రి ప్రథమ భాగములో నగరుపూజ యనగా పంచవర్ణములతో కళ్యాణ మంటపముపై కోలీవేసి అందుపై సిలమంచబడును. ఆకోలీ (ముగ్గు) నాలుగుప్రక్కల నాలుగు కలశలనుంచి వానిలో బియ్యమును పోసి నాలుగు కరప్రుల్లలుంచబడి వాటిని సూత్రముచేకట్టబడును. కన్యావరులను పాతవస్త్రములతోను ముకుటములతోను మంటపముపై కూర్చుండబెట్టి వరుణపూజ జరిగినపిదప విసర్జనమంత్రములజే వానిని విపరించి మంత్రపూర్వకముగా నూతన వస్త్రముకుటములను ధరించి పుణ్యాహవాచకము జరిగిన పిమ్మట కన్యావరులను సిలారోహణము జేయించి బంధువులచే వారల సిరస్సులకుపైగా నూతన వస్త్రమును బట్టి బ్రాహ్మణులు నాలుగు ప్రక్కలను నిలుపబడి మంత్రోచ్ఛాటనలు జేయుచు ఆవస్త్రముపై యక్షతలను వేయుదురు. అప్పటిలో కన్యావరులిద్దరు గోధాన్యాది లాభములను గూర్చి మనోసంకల్పము చేయుచుందురు. ఆయక్షతలను బ్రాహ్మణులుదీసి దంపతులిద్దరికి నాశీర్వదించెదరు. తరువాతను పుణ్యాహవాచకము, స్వస్తివచనము, వరుణపూజచేసి పంచభూసంస్కారములతో హోమము చేయబడును హోమములో జాతమయిన "చరుపాకము" ను(హోమములో వుడికిన బియ్యము) కన్యావరులు భక్షించెదరు, అప్పుడునీళ్ళచే పురోహితుడు మార్జనము చేయును. యథాశక్తిని ఫలదానాది

దక్షిణలివ్వబడును.

అయిదవదినము. వరుణపూజ, ఆశీర్వాదము, వసంతో త్సవము జరుగబడును.

ఆరవదినము:- బెద్దిపొడియా. వధూవరులచేకళ్యాణమంట పముపై గవ్వచేనాడించబడును తదితర కర్మ జరుగబడదు.

ఏడవదినము:- కంకణోద్వాసము, మొండాబిద్దా

ఎనిమిదవదినము:- విషదినముగాన వరుడు పెండ్లి గృహమునుండి అలకచేనితరులకు దెలియక వెడలును. ఈదినమంతయు కన్యయొక్క గృహమందు వరుడుండగూడదు.

తొమ్మిదవదినము:- కన్యయొక్క తండ్రియు సోదరులు నుగలసి ఫలహారాది వస్తువులతో గూడ వెడలి వరునియొక్కయలు కనుదీర్చి తమగృహమునకు వానిని తోడ్కొని పోబడును. తరువాత వధూవరులు గవ్వలచే నాడెదరు.

చంద్రద్వితీయబంధాపన:- శుద్ధవిదియ సాయంకా లములయందునభక్ష్యాది పిండివంటలుచేసి చంద్రుని స్వరూపమొకపీటపై స్థాపనచేసి పూజయొనరింపబడును. ఈపూజవివాహమైనసంవత్సరము వరకు నూతన చంద్రదర్శనమైన ప్రతిమాసములోను జరుగబడును.

సంవత్సరవృద్ధి:- వివాహమైన సంవత్సరాంతమున మధు పర్కములు (పసపుపొత్తులు)మకుటమాలను ద్వాసన జేయబడును.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణపరబ్రహ్మ కరుణా కటాక్షలబ్ధ విద్యావైభవ కాత్యాయని సూత్రయాజ్ఞవల్క్యగోత్ర గౌడబ్రా హ్మణ శిష్టకరణ వంశోద్భవ కుప్పిలి రంగయాఖ్య చతుర్థతనయనయ గుణవిధేయకృష్ణమూర్తి నామధేయ ప్రణీతంబైన శ్రీమదుత్కల విప్రవంశ ప్రదీపిక యను గ్రంథంబునందు చతుర్థాధ్యాయము.

సంపూర్ణము.

శ్రీ

# ఉత్కల విప్రవంశ ప్రదీపిక.

## పంచమాధ్యాయము

### అథగోత్ర ప్రవర నిర్ణయః

బ్రహ్మఋషి సంతతివారలు బ్రాహ్మణులు.

మూ॥ విశ్వామిత్రో జమదగ్నిర్భరద్వాజోథగోతమః ।
అత్రిర్వసిష్టః కస్యపఇత్యే తేసప్తఋషయః ॥

విశ్వామిత్రుడును, 2. జమదగ్నియును, 3.భరద్వాజుండును. 4. గోతముడును, 5. అత్రియును, 6. వసిష్టుడును, 7.కశ్యపుడును వీరలు సప్తమహాఋషులు

మూ॥ సప్తానామృషీణామగస్త్యాష్టమానాం
యదపత్యం తద్గోత్ర మిత్యాచక్ష తే॥

తా॥ అగస్త్యుని ఎనిమిదవ వానిగా కలిగిన ఏడుగురైనఋషుల యొక్క యేదిసంతానమో అదిగోత్రమని చెప్పబడుచున్నది.

మూ॥ ఋషిణాహి దేవాః పురుషమనుబధ్యంత ఇతివిజ్ఞాయతే ।
అథాపరం విజ్ఞాయతే ఆషేన్ యం ప్రవరమన్వాచష్టే॥

తా॥ ఋషులపేర్లు చెప్పాటచేతను దేవతులు యజమానుని

ఋషిసంతానమని తెలిసికొనుచున్నారు. గాన ఋషిసంబంధమైన ప్రవరమును వరుసగా చెప్పవలయును.

మూ॥ యోవాఅన్యస్సన్నధాన్య స్యార్షేయేణ ప్రవృణీతే।
సవాఅస్యతద్రుచాలిష్టం వీతం వృంక్తఇతివిజ్ఞాయతే॥

తా॥ ఎవడు అన్యగోత్రుడై అన్యునియొక్క ఋషులపేరులుచెప్పి వరించుచున్నాడో వీనియొక్క యాగఫలమును, తర్పణాదిఫలమును ఆఅన్యఋషి పొందుచున్నాడని తెలియబడుచున్నది.

మూ॥ పురోహిత ప్రవరో రాజ్ఞాం॥

ప్ర॥ రాజ్ఞాం=క్షత్రియవైశ్యులకు, పురోహితప్రవరః=పురోహితుల యొక్క ప్రవరము చెప్పవలయును.

మూ॥ నపురోహిత ప్రవరా స్త్వేవం న్యాయేన॥

వ్యాఖ్యా॥ క్షత్రియాణాం విశేషః పురోహిత ప్రవరా ఏవ తే భవితుమర్హంతి న్యాయేన సర్వేషాం పురోహితస్య విద్యమానత్వాత్ ఆత్మనః కర్మణి అధికారాత్ పురోహిత ప్రధానా ఏవ తేభవితుమర్హంతి.

టీ॥ న్యాయేన=విచారించగా, తే=ఆక్షత్రియులు, సపురోహితప్రవరాః ఏవ=అందరికిని పురోహితుడు ఉంచున్నాడు గనుకను, తనకర్మయొక్క అధికారము పురోహితునియందున్నది గనుకను, పురోహితప్రవరముచేతనే వరించవలయును.

మూ॥ పురోహితస్య ప్రవరేణ రాజా ప్రవృణీత ఇతివిజ్ఞాయతే।

వ్యా॥ పురః ఏనం దధాతీతి పురోహితః-క్షత్రియవైశ్యయోర్ద్వార్విహోమికః అభిజనవిద్యావృత్తసహితః తస్యప్రవరేణ రాజా అభిషిక్తః ప్రవృణీతే=బ్రాహ్మణోపిరాజ్యం ప్రాప్తః పురోహిత ప్రవరేణ ప్రవృణీతే॥

టీ॥ రాజా=(అభిషిక్తుడైన) రాజు, పురోహితస్య=పురోహితుని- ప్రవరేణ=ప్రవరచేత, వృణీతే=వరించవలయును, ఇతి=అని, విజ్ఞాయతే=తెలియఁబడుచున్నది (బ్రాహ్మణుఁడు రాజ్యమును పొందినవాడైతే అతడున్ను పురోహితుని ప్రవరతోటి వరించవలయును.

మూ॥ అథాసంప్రజ్ఞాత బంధురాచార్యా
ముపాధ్యాయణమనుబ్రవీత॥

టీ॥ అథ = అనంతరము, అసంప్రజ్ఞాతబంధుః = బాగుగఁ దెలియఁబడ ఋషి ప్రవరముగల (బ్రాహ్మణుఁడు) ఆచార్యాముపాధ్యాయణం = ఆచార్యుని ప్రవరను, అనుబ్రవీత = వరుసగాఁ జెప్పవలయును. (త్రియుని విషయములో పురోహిత ప్రవరము చెప్పవలయును)

క్షత్రియవైశ్యులున్ను బాగుగా తెలియబడని ఋషిప్రవరము గల బ్రాహ్మణులు, తామ పురోహితుని యొక్క ప్రవరముతో వరించవలయునని ఆపస్తంబ ప్రవరకాండములో చెప్పబడియె.

మూ॥ భృగూణాం నవివాహోస్తి చతుర్ణామాదితో మిథః।
శైతాదయస్త్రయస్తేషాం వివాహో మిథ ఇష్యతే॥

తా॥ మొదలు నాలుగైన భృగులకు, ఒకరికొకరు పెండ్లి లేదు. శైత్యాదులైన ముగ్గురు వారలకు పెండ్లి ఒకరికొకరు ఇష్టముగా నున్నది.

మూ॥ షణ్ణాం వై గౌతమాదీనాం వివాహో నేష్యతే మిథః।
దీర్ఘతమా ఔచథ్యః కక్షీవాన్ శ్చైక గోత్రజాః॥

తా॥ ఆరుగురయిన గౌతమాదులకు పెండ్లి ఒకరికొకరు ఇష్టము లేదుగదా! దీర్ఘతమ అను ఋషి, ఔచథ్య అను ఋషి కక్షీవాన్ అను ఋషియును, ఒక గోత్రమునందు బుట్టినవారలు.

మూ॥ భరద్వాజాగ్ని వేశ్యర్క్షాః శుంగాః శైశిరయః కతాః।
ఏతే సమానగోత్రాః స్యుర్గాన్ నేకే పదంతి వై॥

తా॥ భరద్వాజ, అగ్నివేశ్య, ఋక్ష అను ఋషులును, శుంగఋషియును, శైశిరఋషియును, కతఋషియును, వీరలు ఒక గోత్రము గలవారలుగా అగుచున్నారు. కొందరు సమానగోత్రములుగా చెప్పుచున్నారు.

మూ॥ పృషదశ్వా ముద్గలా విష్ణువృద్ధాః
కణ్వోగస్త్యో హారికస్సంకృతిః కపిః।
యస్కాశ్చైషాం మిథఇష్టోవివాహః
సర్వైరన్యైర్జామదగ్న్యాదిభిశ్చ।

తా॥ పృషదశ్వులును, ముద్గములుకును, విష్ణువృద్ధులును, కణ్వుడును, అగస్త్యుడును, హారితుడును, సంకృతియును, కపియును, యస్కుడును, వీరలకు పరస్పరము పెండ్లి ఇష్టము సమస్తులయిన ఇతరులనజామదగ్ని మొదలగువారిచేత వివాహముఇష్టమైనది.

మూ॥ యావత్సమానగోత్రోస్యుర్విశ్వామిత్రోనివర్తతే।
తావద్వసిష్టశ్చాత్రిశ్చ కశ్యపశ్చ పృథక్ పృథక్॥

తా॥ ఎంతవరకు విశ్వామిత్రుడు ఉంచున్నాడో, అదివరకు వసిష్టుడును, అత్రియును కశ్యపుడును, వేర్వేరుగా ఒకగోత్రములవారలగుచున్నారు

మూ॥ ద్వ్యార్షేయాణాం త్ర్యార్షేయ సన్నిపాతేఽవివాహః
త్ర్యార్షేయాణాం పంచార్షేయ సన్నిపాతే అవివాహః॥

తా॥ రెండుప్రవరలుగలవారలకు మూడుప్రవరములుగలవారల యొక్క చేరడమునందు వివాహములేదు. మూడు ప్రవరములుగల వారలకు ఐదుప్రవరములుగలవారలయొక్క చేరడమునందు వివాహము లేదు.

మూ॥ భృగూణాం అంగిరసాంతస్యథ్వం॥

తా॥ భృగ్వంగిరసులు చాలాగొప్పఋషులు. వారిసంతతివారలు బాహుళ్యముగా విస్తరించియుండుటచేనాఋషులు ప్రవరలలోనచ్చి నను పరస్పరవివాహములు చేసికొనవచ్చును.

మూ॥ ఏకపంచఋషిర్యావత్ ప్రవరేష్వనువర్తతే।
తావత్సమానగోత్రత్వ మన్యత్ర భృగ్వంగిరసాంగణాత్

తా॥ ప్రవరములయందు ఎంతవరకు ఒకేఋషి అనువర్తించు చున్నాడో అంతవరకు భృగ్వంగిరులయొక్క గణముకంటె వేరు చోట సమానగోత్రముగలది.

మూ॥ ఇద్వ్యసమాన ప్రవరై ర్వివాహో వివాహః॥

తా॥ గనుక భిన్న ప్రవరముగలవారితో గూడ వివాహము చేయవచ్చును.

## 1. యాజ్ఞవల్క్య ఋషిః.

దేవరాతాశ్చికితమనుంతౌలకివాలకి యజ్ఞవల్క్యలూకబృహదగ్ని బభ్రుశావిని శాలావతశాలంకాయన కాలబవాః తేషాం త్ర్యార్షేయః వైశ్వామిత్రదైవరాతౌతి॥

తా॥ చిక్షితాః, మనుతంతమః, ఔలకాయః, వాలకాయః, యాజ్ఞవల్క్యః, ఉలూకాః, బృహదగ్నయః బభ్రవః, శావినయః, శాలవతాః, శాలంకాయనాః కాలబవాః. ఈ పేరులుగలవారు దేవరాత వంశీకులుగాన వైశ్వామిత్ర, దైవరాత, ఔదవ. అనిముగ్గురుఋషులు గల ప్రవరమును చెప్పవలెను. వీరి ప్రధానఋషివిశ్వామిత్రుడు.

యాజ్ఞవల్క్యనాం వైశ్వామిత్ర దైవరాతౌతి, త్ర్యార్షేయ ప్రవరాన్విత యాజ్ఞవల్క్య గోత్రః సామవేదశ్శా ఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (కృష్ణమూర్తి) శర్మాహంభోఅభివాదయే॥ ఈగోత్రము గలవారి

### ఇంటి పేర్లు.

1. కుప్పిలివారు.
2. ప్రతాపరావువారు.
3. మగడవారు.
4. బొండపిల్లివారు.
5. కొట్టక్కివారు.
6. తట్టికోటవారు.
7. గలావిల్లివారు.

ఈ వంశస్థులలో కొందరు ఉలూకఋషిగోత్రమును చెప్పెదరు. ఔలుక, వాలక. ఉలూక, యాజ్ఞవల్క్య, అనుఋషులు ఒక్కరేగాన యాజ్ఞవల్క్య అనిచెప్పుటయేసరియైనది.

## 2. భరద్వాజఋషిః

భరద్వాజానాం అంగిరస బార్హస్పత్య భారద్వాజేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజగోత్రః సామవేద శ్యాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......) శర్మాహంభోఅభివాదయే వీరిప్రధాన ఋషులు భరద్వాజ, అంగిరస. ఈగోత్రముగలవారి

### ఇంటి పేర్లు.

1. పక్కివారు.
2. భోగిలవారు
3. రాయఘుడవారు.
4. మద్దారావువారు.
5. రాజేటివారు.
6. డొంకాడవారు.
7. సింహ్వాపువారు.
8. వంతరాంవారు.
9. బెహరావారు.
10. వీరఘట్టపువారు.
11. రధిరావువారు.
12. కూరాడవారు.
13. రేగులవలసవారు.
14. మణిపాత్రునివారు.
15. నాగమణివారు.
16. చౌదరివారు
17. కొట్టినవారు.
18. రేగిడి వారు.

## 3. శుంగఋషిః

శుంగనాం ఆంగిరస బార్హస్పత్య భారద్వాజేతి త్ర్యార్షేయప్రవ రాన్విత శుంగగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే.

తా॥ శుంగగోత్రీకులు, అంగిరస, బార్హస్పత్య, భారద్వాజ అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. ఈగోత్ర ముగలవారి ప్రధానఋషులు భరద్వాజ, అంగిరస.

ఇంటిపేర్లు.

1. శతమంతరావువారు — 2.

## 4. గౌతమ ఋషిః

గోతమానాం అంగీరసాయస్య గౌతమేతి త్ర్యార్షేయ ప్రవరా న్విత గౌతమగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ గౌతమగోత్రీకులకు అంగిరస, ఆయాస్య, గౌతమఅని ముగ్గురు ఋషులుగలప్రవరమునుచెప్పవలయును. వీరిప్రధానఋషులు —గౌతమ, అంగిరస ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. కరకవల్సవారు. | 2. రొట్టవలసవారు.

3. వృద్ధపోలువారు. 4. పాత్రనిమహంతివారు
5. మామిడిపిల్లివారు.

## 5 ఆత్రేయఋషిః

అత్రీణామాత్రే యార్చనాన సస్యావాశ్వేతి త్ర్యార్షేయప్రవరాన్విత ఆత్రేయ గోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయని సూత్రః (......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ అత్రిగోత్రముగలవారికి ఆత్రేయ, అర్చనాన, సస్యావాశ్వ అనుముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలెను ఈగోత్రముగల వారి ప్రధాన ఋషి అత్రి.

ఇంటి పేర్లు.

1. వాంద్రడంకివారు.
2. ములగనలసవారు
3. కొండనలసవారు.

## 6. ముద్గలఋషిః

అథాముద్గాలానాం అంగిరస భార్మ్యశ్వ మౌద్గల్యేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత మౌద్గల్యగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......)శర్మాహంభో అభివాదయే.

తా॥ ముద్గలగోత్రీకులకు అంగిరస, దర్మ్యశ్వ, మౌద్గల్య, అని ముగ్గురు ఋషులుగల ప్రవరము అపస్థంభ ప్రవరకాండ ప్రకారము చెప్పుదురు. కొందరు అశ్వలాయన ప్రవరకాండ ననుసరించి

మూ॥ మౌద్గలానాం అంగిరస, బార్మ్యశ్వ మౌద్గల్యేతి।
తార్క్ష్యం హైకేబ్రువతేతి త్ర్యాంగి
రసంతార్క్ష్య భార్మ్యశ్వ మౌద్గల్యేతి॥

తా॥ అంగిరస, భార్మ్యశ్వ, మౌద్గల్య, అనిముగ్గురుఋషులుగల ప్రవరమును చెప్పుదురు. వారికొందరు అంగిరసపదమును విడచి తార్క్ష్యపదమునుచేర్చి, తార్క్ష్య, భార్మ్యశ్వ, మౌద్గల్య, అని చెప్పెదరు వీరల ప్రధానఋషిఅంగిరస ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. శేఖరమహంతివారు.
2. పంచాదివారు.
3. మార్కండవారు.
4. రేగవారు
5. తామరఖండివారు

## 7. వసిష్ఠఋషిః

మూ॥ వాసిష్ఠేతి వసిష్ఠానాం యేన్య
ఉపమన్యు పరాశర కుండినేభ్యః॥

తా॥ వసిష్ఠగోత్రమువారికి ఉపమన్యు, పరాశర, కుండినఋషుల కంటె ఎవరు ఇతరులో వారు వసిష్ఠ అని ఒకఋషిగోత్రమునుగల వారు. వీరిప్రధాన ఋషి వశిష్ఠ. ఈగోత్రముగల వారి

ఇంటి పేర్లు

1. శింగుమహంతివారు.

## 8. కుండినఋషిః

అథకుండినానాం త్ర్యార్షేయః। వాసిష్ఠమైత్రా వరుణకౌండిన్యేతిప్రవరాన్వితకౌండిన్యసగోత్రః, సామవేదశాఖాధ్యాయీ, కాత్యాయనీసూత్రః ( ..... ) శర్మాహంభో అభివాదయే॥

తా॥ కౌండిన్యగోత్రికులకు వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య, అని ముగ్గురు ఋషులుగల ప్రవరము చెప్పవలయును. వీరిప్రధాన ఋషివసిష్ఠ. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు

1. మంత్రివారు.
2. గజగంటరావువారు.
3. మురహారిరావువారు.
4 అమరాంవారు.

## 9. పరాశరఋషిః

అథ పరాశరాణాం త్ర్యార్షేయః । వాసిష్ఠశాక్త్యపారాశర్యేతి ప్రవరాన్విత పరాశర గోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (......) శర్మాహాంభో అభివాదయే॥

తా॥ పరాశరగోత్రికులకు వాసిష్ఠ, శాక్త్య, పారశర్య, అని ముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. వీరి ప్రధాన ఋషి వసిష్ట. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు

1. నీలాడివారు.

## 10. ప్రతీశ్వరఋషిః

ప్రతీశ్వరాణాం సప్తార్షేయః । మనుమాండవ్య లోహితపురూరుహాపరాశర నైధృవప్రతీశ్వరేతి ప్రవరాన్విత ప్రతీశ్వర గోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......) శర్మాహాంభో అభివాదయే॥

తా॥ ప్రతీశ్వర గోత్రికులకు మను, మాండన్య, లోహితపురూరుహ, పరాశర, నైధృవ, ప్రతీశ్వర, అనిస ప్తర్షులుగల ప్రవరమును చెప్పవలెను. వీరి ప్రధానఋషి పరాశర. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు

1, చక్రధరమహాంతివారు

## 11. శాండిలఋషిః

అథశాండిలానాం త్ర్యార్షేయః॥ దైవలాసితేతి ప్రవరాన్విత

శాండిలగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః (.....)శర్మాహంభో అభివాదయే॥

తా॥ శాండిలవంశీకులకు దైవల, అసీత, అనిఇద్దరు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును.

మూ॥ త్ర్యార్షేయము హైకే కాశ్యప దైవలాసితేతి॥

తా॥ కొంతమంది ముగ్గురుఋషులుగల ప్రవరము చెప్పవలెనని చెప్పెదరు. కాశ్యప, దైవల. అసీత, అనిప్రవరమును చెప్పవలయును. లేదా

మూ॥ శండిలానాం శాండిలాసితదైవలేతి॥

తా॥ శాండిల, అసిత, దైవల. అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పెదరు. వీరిప్రధానఋషి కశ్యప. వీరి

ఇంటిపేర్లు

1. ఇప్పిలివారు.
2. బలివాడవారు.
3. ఆమిటివారు
4. లోచర్లవారు.
5. నందిగాంవారు.
6. కవిటిభద్రవారు.
7. రావిపల్లివారు

## 12. కష్యపఋషిః

కశ్యపానాం కాశ్యపావత్సారాసితేతి. త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపగోత్రః సామవేద శ్శాఖాధ్యాయీ కాత్యాయని సూత్రః (......) శర్మాహంభోఅభివాదయే॥

తా॥ కస్యపుగోత్రీకులకు కాశ్యప, అవత్సార, అసిత, అనుముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలెను వీరిప్రధానఋషి కశ్యప, ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

1. డబ్బీరువారు
2. త్రేడవారు
3. లావేటివారు
4. రాజాపురంవారు
5. కోటగంగ్రేడువారు.
6. ఖస్బావారు.
7. పురుషోత్తమహంతివారు.
8. పద్మాపురంవారు.
9. వాడాడవారు.

## 13. శ్రీవత్సఋషిః

జామదగ్న్యవత్సాః తేషాంపంచార్షేయో। భార్గవచ్యావనాప్నువానౌర్వ జామదగ్నేతిప్రవరాన్విత శ్రీవత్సగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీసూత్రః(......) శర్మాహంభో అభివాదయే॥

తా॥ శ్రీవత్సరులోత్పన్నులు, జామదగ్ని సంతానులై ఉన్నారు. వీరికి భార్గవ, చ్యావన, అప్నవాన, ఔర్వ, జామదగ్న్య అనిపంచ ఋషులుగలప్రవరమును చెప్పవలయును. కొందరు భార్గవ చ్యావన అప్నవాన అనిముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పెదురు గాని అశ్వలాయనఆపస్తంబ ప్రవరకాండలననుసరించి పంచఋషులు గల ప్రవరమునే చెప్పవలయును. వీరిప్రధాన ఋషి భృగు, ఈగోత్రం గలవారి ఇంటిపేర్లు

1. రాజపాత్రునివారు
2. సదాసివునివారు
3. అంపలాంవారు
4. నందిగాంవారు
5. జొద్దుమహంతివారు.
6. పోలుమహంతివారు.
7. పోతుమహంతివారు.
8. పోలాకివారు

## 14 అంగిరసఋషిః

అథాంగిరసానాం త్ర్యార్షేయః। అంగిరసాయస్య గౌతమేతి ప్రవరాన్విత అంగీరసగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ

సూత్రః (.....) శర్మాహంభో అభివాదయే॥

తా॥ అంగిరసగోత్రీకులకు గౌతమ,ఆయాస్య,అంగీరస, అనిముగ్గురు ఋషులుగల ప్రవరము చెప్పవలయును. ఈ ఋషియొక్క సంతతి వారు నాగేశ్వర, నగంగీరస, యని వృపనామములతో గోత్రములను గూడ వాడుకచేయుదురు గాని యివి ఋషిగోత్రములుగావు వీరిప్రధానఋషి అంగిరస. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు

| | |
|---|---|
| 1. నౌపడావారు. | 9. పెదపెంకివారు. |
| 2. రఘుపాత్రునివారు. | 10. సంతపురిటివారు. |
| 3 పురిటివారు. | 11 మర్కునవారు. |
| 4 కంఠిమహంతివారు. | 12. అనంతపట్నాయకునివారు. |
| 5. నాగుమహంతివారు. | 13. పట్నాయకునివారు. |
| 6. జగ్గుమహంతి వారు. | 14. కల్లెపల్లివారు. |
| 7. నారాయణమహంతివారు | 15. మహపాంవారు. |
| 8. పొట్నూరువారు. | 16. మండవకుర్తిటివారు. |
| 19. ఉర్లాందారు. | 17 వెంకుమహంతివారు. లోయావారు |

## 15. కౌసికఋషిః

చికితగాలవకాలబవమనుతన్తు కుసికానాం వైశ్వామిత్ర దైవరాతౌదలేతిత్ర్యార్షేయప్రవరాన్విత కౌసిక గోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ, కాత్యాయనీ సూత్రః(......)శర్మాహంభోఅభివాదయే॥

తా॥ చికిత, గాలవ, కాల, బవ, మను, తన్తు, కుసిక, గోత్రములవారికి, వైశ్వామిత్ర, దైవరాత, జౌదల, అనుముగ్గురు ఋషులుగల ప్రవరమును చెప్పవలయును. వీరిప్రధాన ఋషి అంగిరస ఈ గోత్రముగలవారి

ఇంటి పేర్లు.

| | |
|---|---|
| 1. యెల్లుమహాంతివారు | 5. బలరామమహాంతివారు. |
| 2. కాసిమహాంతివారు | 6. సాలెహుండాంవారు. |
| 3. రాజమహాంతివారు | 7. తోణంగివారు. |
| 4. దుర్గమహాంతివారు | 8. కొర్లాంవారు. |

## 16. హరితఋషిః

అధహారితానాం త్ర్యార్షేయః అంగీరసాంబరీష యౌవనాశ్వేతి ప్రవరాన్విత హారితగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః (......) శర్మాహాంభోఅభివాదయే॥

తా॥ హారితగోత్రీకులకు అంగిరస, అంబరీష, యౌవనాశ్వ యని ముగ్గురుఋషులుగల ప్రవరమును చెప్పవలెను.

మూ॥ మాంధాతారం హైకే ఋవతేత త్వాంగిరసం
మాంధాత్రంబరీష యౌవనాశ్వేతి ॥

తా॥ కొందరంగిరసపదమును విడచి మాంధాత్రు పదమును వేసి మాంధాత్రు, అంబరీష, యౌవనాశ్వయని చెప్పుచున్నారు. వీరిప్రధాన ఋషి అంగిరస. ఈగోత్రముగలవారి

ఇంటి పేర్లు

| | |
|---|---|
| 1. నరశిపురంవారు. | 2. దామోదరపాత్రునివారు. |

## 17 శంఖఋషిః

అథశంఖానాం అంగిరసాంబరీష యౌవనాశ్వేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత శంఖగోత్రః సామవేదశ్శాఖాధ్యాయీ కాత్యాయనీ సూత్రః(......) శర్మాహాంభోఅభివాదయే॥

తా॥ శంఖగోత్రముగలవారికి అంగిరస, అంబరీష, యౌవనాశ్వ ముగ్గురుఋషులుగల ప్రవరమును చెప్పవలెను. వీరిప్రధాన అంగిరస వీరి

## ఇంటి పేర్లు.

1. బాడంగివారు |

ష రా .

ఈ పైనుదహరించిన గోత్రికులు గాక మరికొన్ని శాఖలవారు నీ కళింగదేశంబులో నచ్చటచ్చటగలరు. కొందరు జాతిసంకరమున కొంద రాచారలో మున మరికొందరీ సంఘీకులులేని దూరపుదేశ ములకు లౌకికవృత్తిచేబోయి యచ్చట నివసించుటచేతను వేర్వేరు శాఖలుగ విభజింపబడిరి. ఆర్యులీకళింగదేశమునకు వచ్చిన తర్వాత వారిలోకొందరు వణిగ్వ్యాపారములకై మచిలీబందరాదియితరదక్షిణ ప్రాంతపురేవులకుబోయి యచ్చట స్థిరవాసులై నానాటికి తూర్పు దేశమునయున్న సంఘముతో సంబంధ బాంధవ్యంబులు విడనాడి ఉత్కల సాంప్రదాయకమును విడచి ఆంధ్రులతో గలసి వారి యాచారములననుసరించి సంచరిం మచుందురు వీరలుఃత్కలబ్రాహ్మణ శాఖలోనివారగుటచే శిష్టకరణంబుఃనిపిలువంబడి ద్విజులనబడుదురు.

గద్య॥ ఇది శ్రీమద్గోపాల కృష్ణపరబ్రహ్మ కరుణాకటాక్షలబ్ధ
విద్యావైభవ కాత్యాయనీ సూత్రియాజ్ఞ వల్క్య
గోత్రగౌడబ్రాహ్మణశిష్టకరణవంశోద్భవకుప్పిలి
రంగయాఖ్యచతుర్థతనయనయగుణవిధేయ
కృష్ణమూర్తినామధేయప్రణీతంబైన
శ్రీమదుత్కలవిప్రవంశప్రదీపిక.
యను గ్రంథంబునందు
పంచమాధ్యాయము
సంపూర్ణం.
శ్రీకృష్ణార్పణమస్తు.





ఈ ప్రతులు వలయువారు:

యీ క్రిందివారితో సంప్రదించవలెను

1) **కుప్పిలి రాఘవరావు,**
కుప్పిలి గ్రామం, శ్రీకాకుళం జిల్లా

2) **కుప్పిలి సుదర్శనరావు,**
ఆమదాలవలస-ఫోన్: 91. శ్రీకాకుళం జిల్లా

